శ్రీరస్తు.

శ్రీశారదాంబాయనమః

# సుజ్ఞానతత్త్వ పూర్ణోదయం బను

# బ్రహ్మగీతా రహస్యము.

ఇయ్యది
శ్రీమద్గార్గేయపుత్రవంశ పయః పారావార
రాకా సుధాకరాయమాన శ్రీవిష్ణుగోత్ర సంభూత
ముత్యాల- రామస్వామియోగి పుత్రుండును
శ్రీమార్గ- వైవశిఖామణియును
దిగంబరేశ్వర స్వాములవారి ప్రియశిష్యుండును
నెల్లూరులో చేరిన నారాయణరెడ్డిపేట
నివాసస్థుండును నగు
ముత్యాల - నారసింహ యోగీంద్రునిచే
రచియింపబడి

చెన్నపట్టణము పాతచాకలపేట యందుండు
పద్మ - త్యాగరాయ సెట్టిగారి
శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపఁబడియెను.

1909

 — (వెల 0-8-0.

శ్రీగణేశాయనమః.




అయ్యలారా?

బ్రహ్మవిష్ణుమహేశానాం భారతీం జలజాలయాం। కాత్యాయనీం మహాదేవం ధ్యాయే దీప్సితసిద్ధయే॥

శ్రీరామచంద్ర కరుణాకర దీనబంధో। సీతాసమేత భరతాగ్రజ రాఘవేశ। పాపార్తిభంజన భయాతురదీనబంధో। పాపంబుధౌ పతితముద్ధర మామనాథమ్॥

నమశ్శివాయ సర్వాయ ప్రాప్యప్రాపక రూపిణే। తత్త్వార్థబోధ నిష్ఠాయ కలికల్మష హారిణే॥

శ్లో॥ అంతర్జ్యోతి ర్బహిర్జ్యోతిః ప్రత్యగ్జ్యోతిః పరాత్పరః। జ్యోతిర్జ్యోతి స్స్వయంజ్యోతి రాత్మజ్యోతి శ్శివోస్మ్యహమ్॥

వ॥ శ్రీమదనంత నిగమాంత పరతత్త్వార్థ ప్రకాశమాన భక్తజన మనన నిధి ధ్యాస పఠన యుక్తంబును మృదుమధుర శైలిగలిగి సులభ సంస్కృతాంధ్రపద సముదాయంబై వినువారలకు శ్రోతవ్యమై మోక్షార్థులకు ముక్తిప్రదాయకమై స్వానుభవులకు కేవల పరిపూర్ణ కూటస్థల దాయకమై యొప్పారుచుండునట్లు శ్రుతిస్మృతిపురాణేతిహాసానుగుణ్యంబై యొప్పెడి నధ్యాత్మిక సమ్మార్గములగుం గొన్ని వేదాంత గ్రంథమ్ములలోని శ్లోకములతో నాంధ్ర పద్యయుగ్మములు

మెలంకువతోడ సేకరించి సవ్వటవ్వట నుపమానోపమే
యముల నుపకరింపన్గిలించి (సుజ్ఞానతత్త్వ పూర్ణోదయం)
బను పేరంబరగెడు బ్రహ్మగీతా రహస్యమను నిష్పరమార్థ
తత్త్వజ్ఞాన మార్గింపం దొడగు ముముక్షువులకై వక్ష్యం
తోప యుక్తంబుగా నంతర్యామి నిశ్చయత్త్వము ప్రత్యక్ష
ముగా హృదయమ్మున దీట్లాడం జేయుమన నెవ్వరిలంపే నెద
నుంకించి యుపన్యాసయుక్తంబులగుం గొన్ని విశేషంబులగా
తేనసోనయై గళాంకురంబున స్రవించి రుచిబుట్టించుచుండు
తెలుంగున సర్వజనమనోభిరామంబుగా క్రోడీకరించు విదా
నం బెట్టనిని= ఈయిహలోకంబున మానవులమై జన్మించుట
దుర్లభంబై యున్నను పూర్వజన్మ పుణ్యపరిపాకం బౌనగూ
డుటచే మానవులమై జన్మించియున్నారము ఇట్టి జన్మమం
దు మనము జీవించుతఱి బాల్య, యౌవ్వన, కౌమార, వార్ధ
క్యంబులు ఝరీ వేగతుల్యంబులై గ్రసింపుచుండుటం జేసి మతి
మంతులమై సమస్తపురుషార్థములలో మూలంబై స్వశ్రేయ
స్సాధనంబై శాంతిక్షేమమై గరిష్ఠవిజృంభిత జ్ఞానమై చేరి
నట్టి నిష్కామ కర్మానుష్ఠానాభ్యుత పావనమంది ఆగామి
సంచిత ప్రారబ్ధముల నుగ్గాడెడు తెలుంగులింగి వశీకృత మా
నసేంద్రియ మీ దేహ పరియంత మోహాటించక పరమ గురు
వరుసన్నిధికిం జేరంజని భయభక్తి వినయ సంభ్రమంబుమె
ఱయ శిరస్సాష్టాంగ దండప్రణామంబు లాచరించి శరణ్య
లమై సాధనానుభవసిద్ధిం గ్రహింపగాని గాఢాంధకారమ

హస్తి మస్తిష్కమున గోరుచుండుటచే మనమెల్లరము ధైర్య
సాగర సత్త్వాను రూపంబయినఫలంబే వాంఛించి అనిర్వచ
నీయ కళ్యాణగుణ సంపూర్ణ విజ్ఞానసుయోగానుభవ మం
దేడి యుజ్వలంబున యోగారూఢంబగు గద్దియపై నెక్కి
ద్వైతవ్యాప్తిగల యజ్ఞాన తిమిరంబును కృపాకిరణులమై వెడ
వెల్పున కప్పించి వశింపుజేసి కొనుచుంటయే యనర్ఘమగు
బ్రహ్మానంద పదవి యంపిల్లునని వేదంబులు ఘోషించుచున్న
యవియెట్టి ప్రజ్ఞావంతుండైనను పేటికాంతర్గత రత్నముంబో
లె సుజ్ఞానతత్త్వపూర్ణోదయ సిద్ధిన్బొందక ప్రకాశింప జా
లడు ధీమంతులగు విశారదులకు జితేంద్రియత సుగమమై
యుండు తురంగమాతంగాదులు చెప్పినయర్థము గ్రహించి
వాహనాది కార్యంబులందు ప్రవర్తిల్లుచున్నయవి నీచమతి
వ్రాతంబులవలె మాయ లుపచరించక సాధనచతుష్టయ
సంపత్సిద్ధియగు ఋజుమార్గం బవలంబించి యుత్సాహసా
హసంబు వినుమతింపం బూనియుండందగు సత్త్వావర్తక
లభ్యంబైన జ్ఞానరత్నంబు నెడబాసెడు మందభాగ్యుల కవ
శ్యము హానిసంభవమై యమునిపాలిటి గొత్తెలరై బుట్టి
గిట్టుటలకు మూలంబేయగుగావ ధర్మంబదటగలవార నాచ
రించందగు నాచరించెడువారలకు (బ్రహ్మవిద్యా పరిజ్ఞానం
బ్రహ్మప్రాప్తి కరంపరం) బను వేదోక్తిప్రకారం పురాతన
జనకకృత పరిపాకంబానగూడిసిద్ధించెడి సుజ్ఞానోదయముచే
హృదయాంతర్గత చిత్తోల్లాస బ్రహ్మానంద పరిపూర్ణమగుం

దపానమగ్నతఁజెంది నోలలాడవచ్చుగాన మనముతలపసి గురూపదేశ సాధనసిద్ధిలో మిన్నలై జితేంద్రియత నార్జించి చిదఖండానందాద్వయ పరబ్రహ్మైక్య సంయోగ శిష్టులమై మనోదుష్కర్మల తుదముట్టనే సెడి నభ్యాసపాటవంబున తూష్ణీకులమై తోషోద నిర్విణ్ణులమై బహిర్లీనతచే ప్రాకారంబువగిది బ్రహ్మానంద మగ్నులమై ప్రారబ్ధ కర్మఫలంబుల తుదముట్టఁజేయుచు నిత్యనిర్గుణ సత్యపరిపూర్ణంబైన గుప్తంబగు నుదాసీనుని మనోశ్వాసంబుగా వర్ణించి (అహంబ్రహ్మాస్మి) యను వేద వ్యాఖ్యానుభవంబంది గ్రాలుచుంటయే పరమపదంబైన ముక్తి అట్టిసత్యజ్ఞాన మార్జించుటలో (అలస్యాద్యమృతంవిషం) బనునార్యోక్తి ప్రకారము త్వరపడి సుజ్ఞానమార్జించక పోయిన నిహపరలోక దూరులమై మరణకాలంబున దూపిం చిచ్చుదాచిన చందంబుగా దండధరుని పాల్బడి మోహంబను యమృతంబువదలి జనన మరణంబులను కాలకూటంబు మింగి కడతేరుట దుర్లభంబై (పునరపిజననం పునరపిమరణం పునరపిజననీ జఠరే శయనం) బనురీతిగా దుఃఖైకసాగర నిమగ్నులమై యెన్నియో పరిసంస్కారము లొనర్చినను నిరర్థకంబులై పోవుచుండుగాన శ్రీగురుమూర్తి దిగంత విశ్రాంతకీర్తివంతుండు మన లభ్యులగఁజేయం జాలియుండునట్టి మహనీయ్యుని వెదకి శరణ్యులమైన నా ప్రతిఫలంబు కందవచ్చునని తలంచి వెదమొకించి గ్రంథరాజమ్మే చేముముక్షువులకు జనేశ్వర

జగత్తుల నెఱింగెడి కౌసలత్వము తోడ్పడునట్లు ప్రోత్సాహ ము గలుగఁజేయుం జాలుదుమని వాగ్మిదుమధుర స్ఫుటా నుభవరసోక్తులు ముప్పిరిగొన నిండించి సర్వవిబుధ ప్రపం చంబు సంభావించి రాశింపంజేయునట్లు భగవంతుని హృద యాంగ భోజమునందు దేజరిల్లగ స్మరింపుచు రచియించి భద్రమగుటకై ముద్రింపించుటకొగ్గిన పరిమితానంద వార్ధి నోలలాడుచు కృతార్థుండ నయ్యెదనని సంకల్పించి ప్రకటిం పం బూనినాడ నిట్టి యనుభవసారం బధిగమించి అసదృ శానుభవ మందెడి యుజ్వలంబున నంగుమీర నియ్యకొను వారలీ గ్రంథరాజమ్ము తుదముట్టం జదివి కర్ణకుహరంబుల చే తగ్రహించి నిష్టరంగవార్ధి సమధైర్య సుజ్ఞానతత్త్వపూర్వోద య ప్రసన్నచిత్త భరితాంతరంగులరై నాశ్రమము సార్థకం బుగా నుత్కృష్ట పరిపూర్ణ బ్రహ్మానంద సుఖమనుభవించు చుండెదరుగాత.

ఇట్లు,

సకల బుధజన విధేయుఁడు.

ముత్యాల - నారసింహ. యోగి.





శ్రీరస్తు.

శ్రీగణేశాయనమః.

శ్రీరామచంద్రగురు పరబ్రహ్మణేనమః.



# సుజ్ఞానతత్త్వ పూర్ణోదయం బను
# బ్రహ్మగీతా రహస్యము.



జగద్గురుస్తోత్రము.

హరిః

## ఓమ్.

బ్రహ్మానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం। ద్వంద్వాతీతం త్రిగుణ రహితం తత్త్వ మస్యాది లక్ష్యం। ఏకం నిత్యం మమల మచలం సర్వదీ సాక్షిభూతం। భావాతీతం త్రిగుణరహితం సద్గురు తన్నమామి।

శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణు గురుదేవో మహేశ్వరః। గురుసాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవేనమః॥

శ్లో॥ నిరంజనం నిరాకారం దేవదేవం జనార్దనం । మా... యుక్తం జపేన్నిత్యం పావనం సర్వదేహినామ్॥

శ్రీహయగ్రీవస్తోత్రము.

శ్లో॥ జ్ఞానానంద మయందేవం నిర్మలంస్ఫటికాకృతిమ్। ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే॥

శ్రీవినాయకస్తోత్రము.

క॥ శ్రీకరముగ నిర్విఘ్నము। చేకొనిమొదల విఘ్నపతిని చింతిలి పిదపఁ। ప్రాకటముగ సుజ్ఞానవి। వేకము ప్రచురింపబుద్ధి వితమరినైతిఁ॥

శ్రీసరస్వతిదేవి స్తోత్రము.

క॥ శ్రీవాణీనజనిరాణిని। ద్వావిరివాగ్జృంభణంబు వరకవితోత్కల్। ప్రావీణ్యమూని బలికెడు। త్రోవనువసి గొనుట కేను తొలుత నుతింతుఁ॥

త్రిమూర్తుల ప్రార్థనము.

క॥ పరిపూర్ణనిర్వికల్పము॥ నరయుజనించినవిధాత హరిహరుల ననే। బరికింతువేరువేరుగ। స్థిరమతి గీలింతుస్మరణ స్వేచ్ఛగ నెపుడుఁ॥

త్రిశక్తుల ప్రార్థనము.

క॥ ముమ్మూర్తులకాది మాయమగు। నమ్మాయను గలుగువాణి నార్యమలక్ష్మిఁ। నెమ్మదిముప్పూరదలచెద। నిమ్మహినాకవిత చెలగ నింపుగభువిలోఁ॥

## స్వగురు స్తోత్రము.

శ్లో॥ నిత్యానందైక కందాయ నిర్మలాయ చిదాత్మనే। జ్ఞానో
త్తమాయ గురవే సాక్షిబ్రహ్మణే నమః॥

క॥ శ్రీమద్దిగంబరేశ గురు। స్వామికి వందనము చేసి చర్చితజ్ఞానం। బా
ముష్మిక శివజీవుల। కోమగు నైక్యంబు చెప్పెనొలయగ చేతన్॥

క॥ తన్మయుని ధన్యమూర్తిని। సన్మునినిత్యమును సమాధి నుం
డెడువాని। జన్మయగురువరు నెప్పుడు నన్మానస బయలునం
దు సతతముగొలుతున్॥

సీ॥ శరణు శ్రీపరమదేశిక శరణు శరణు। శరణు బ్రహ్మాత్మదే
శిక శరణుశరణు। శరణుశరణాగతత్రాణ శరణుశరణు। శర
ణుయస్మద్గురుప్రభో శరణు శరణు।

## కవీశ్వర స్తోత్రము.

గీ॥ శబ్దశాస్త్రమే నా శబ్దబోధ తెలియంగ। శబ్దనుగుణదోష శబ్ద
ములుగ। శబ్దరహితమైన శబ్దములనిరూఢ్మ। శబ్దవిధులమది
ని శంసజేతు।

క॥ అమర శ్రీకాంత తెలుంగను। క్రమలక్షణకావ్యకయిత కట్ట
డు తెలుగగ। యిమిడి కొమొతిగ ప్రాసలు। సమకట్టెదు సం
చెరుంగ సైరింపదగున్॥

క॥ తప్పులు దోచినదిద్దుచు। జెప్పుదు శిష్టులకు శరణు జేయుదు న
పుడున్। మెప్పగు వాటినితప్పని। జెప్పుడు చవటులతో పొం
దు చింతిల నెపుడున్॥

## గ్రంథకర్త అభిప్రాయ సంగ్రహము.

క॥ శ్రీరాజయోగమందెడు। వారికి చిత్పరసుఖంబు వరివశ్యము
గఁగా। వారధినావచెదాలుకు। తీరునసీగ్రంథపఠితి తీరము
జేర్పఁగా॥

క॥ శ్రీమించు జేయుజ్ఞానము। లోమించక పోరినంత లోకాన్వీత
మా। దీమించుసిగదమించున। క్షేమంబై ముక్తిగదియ జేర్పు
నుభువిలోఁ॥

క॥ తనుదా దెలియఁగ నేర్చిన। ఘనయోగీశ్వరుల చరణ కమలంబు
లకుఁగా। మునుకొని మ్రొక్కఁగ నేర్చిన। జనవర్యుడు పూజ్యు
డగును జగతినిజూడఁ॥

క॥ మాయయుమాయము చేయును। పాయముగల దొకటిదాని
పరికించినచో। మాయని గురుభక్తియె మా। చాయగునిల
మాయ గెలువ చల చిత్తులకుఁ॥

క॥ శరణని గురుపదభక్తిచె। పరమును సాధింపవచ్చు పదిలముగా
గఁగా। శరణన్న తెలియవాయును। శరణన్న సుశ్రీలుగల్గు శాస్త్ర
వమగఁగా॥

క॥ శ్రీయుపనిషద్బోధము గాయకముగు శ్లోకపద్య కందార్థ
ములఁ। రోయక చదివినవారికి। బాయకదర్పణముగరితి ప్ర
త్యయమబ్బుఁ॥

## పరమాత్మమాయా విలాస మహేంద్రజాలాభి వర్ణనము.

శ్లో॥ పరేశం పార్వతీకాంతం రమాధీశం దిగంబరమ్। నిర్మలో
నిత్యతృప్తాత్మా నిత్యానందో మహేశ్వరః॥

శ్లో॥ శరణుశరణు పరబ్రహ్మా। యంత్రమంత్రార్చనావిధి। ఆరో
గ్యమమితాయుష్యమ్ । ఆనందం ఆత్మదర్శనం॥

శ్లో॥ విజ్ఞానంవిధిసుజ్ఞానం। వైరాగ్యం విశ్వరూపకం। అణిమా
ద్యష్టఫలంసిద్ధి। యోగసిద్ధీ మహాత్ఫలం॥

పంచచామరం.— అసంగుడైన బ్రహ్మమందనాది మాయలే
నిదై। ముసుంగు గప్పినట్లునిండి మూలకారణాంశమై।పాసం
గివిశ్వమందుశేరి భూతభౌతికాదులై । మసంగిబుట్టి జావ్ర
చుండు మారులేకనంతటన్॥

పంచచామరం.— చరాచరంబులంటిమాయ చొక్కించి ప్రా
ణులన్। ఝురాఝురిన్ జనన మరణ జాడలంద జావుచున్।
తరాతరంబు సాల్వడంగ తార్కాణంగదానయై। పరాపరా
త్మనంటనివక బ్రాకుచుండు నంతటన్॥

వ॥ ఇట్టిమహేంద్రజాల మాయాకల్పిత మహాభూత పం
చీకృత పంచాశత్కోటి పరివలయితంబై యనేక చిత్రవిచిత్ర
పట్టణ పర్వతారణ్య నదనదీప్రకాశితంబై నరమృగ పశుపక్ష్యా
ది నానాస్థావర జంగమ లీలావిలాసితంబై స్వర్గమర్త్య పాతాళ
సత్యవైకుంఠ కైలాసాది దివ్య లోకాకారంబై సూర్యచంద్రగ్ర
హ నక్షత్రాలంకృతంబై బ్రహ్మవిష్ణు రుద్ర మహేశ్వరాధిష్ఠి
తంబై ప్రకాశింపుచున్ననీ బ్రహ్మాండమునూహించి జూడజ్జూడ
జగన్నాటక మహేంద్రజాలంబే యైయున్నయది నీయింద్రజాల
మహేంద్ర జాలంబులగు పద్మాయాయంత్రము హృదయంగ
మమై స్త్రీపురుష రూపంబులతో నటించుచున్న నీప్రపంచము

ను ఏకపటనాటక సూత్రధారి అనిర్వచనీయుండై మాయాసమే తుండై యన్నింటికి లోవెలియై ప్రకాశింపుచు కాలకర్మ సూత్రంబునగ్గట్టి విశ్వమోహినియనెడు మాయ తెఱలోబెట్టి నాడించుచు జూచుచుజూడనట్లుండెను జంత్రకారుని స్వప్రకాశుండనియును భగవంతుండనియును అదిదేవుం డనియును అకల్పితుండనియును గుణరహితుండనియును విష్వుండనియును విశ్వాత్మకుండనియును విరాట్ స్వరూపుండనియును నారాయణుండనియును నిర్గుణుండనియును పరబ్రహ్మమనియును పరిపూర్ణుండనియును వేదాగమాదు లుచ్చరింపుచున్నవి ఇట్టనేక నామంబులచే ప్రతిపాదింపుచున్న శుద్ధపరిపూర్ణంబునకు శుద్ధబ్రహ్మమని పేరాయెను అందు మాయాశక్తి బుట్టుటచే అతీతబ్రహ్మమని పేరాయెను అగ్నియందు వుష్ణమువలె ప్రకాశించుచున్న శుద్ధబ్రహ్మమునందు (శుద్ధసత్వము శుద్ధరాజసము శుద్ధతామసము) లుత్పల్లమైయ్యె నందు శుద్ధసత్వమునకు మాయయనియును సర్వజ్ఞు వుపాధియనియును ఈశ్వరశరీరమనియును పేరాయెను నాశుద్ధరాజసమునకు సృష్టికర్తయనియును నాశుద్ధతామసమునకు సంహారకర్తయనియును త్రిగుణములకు వెర్వేర పేర్లైయ్యెప్పియున్న నీత్రిగుణసహిత సర్వాంతర్యామి విశేషశక్తితోడ నగూడుటంబట్టి ఆకాశమును నాఆకాశమువలన వాయువును నావాయువువలన నగ్నియును నాయగ్నివలన జలమును నాజలమువలనప్పృథ్వియును నాపృథివివలన నోషధులును నాయోషధులవలన స్త్రీపురుష జంతుజాలంబులు లోకాన్వితం

బై మహేంద్రజాలంబులై స్ఫురించుచున్నయావి నిట్టిప్రపంచ
భూత సంయోగ జీవరాసుల యందు నింద్రజాలకుని భంగి
నాశుద్ధబ్రహ్మము తానేయన్నింట నిండియుండుటంబట్టి పరిపూ
ర్ణుండని పేరాయెను ఇట్లన్నిటనిండి కపటనాటకుండై యాడిం
చుచు తానాడకచూచుచు తాచూడక యుండుటన్బట్టి నిరం
జనుడయ్యెను అట్టి నిరంజనునిలో మాయయును మాయాప్రతి
బింబములును లేనియెడల నిర్వికార పరిపూర్ణ నిరంజనుడై అన్నిం
టతానేతానై ప్రకాశించు చుండు నట్లన సూర్యునిప్రకాశము
లో చీకటివేకైదోచి వెల్తూను వవీనమగునట్లు నరపశుజంతుజా
లంబులు ఓషధులయందును ఓషధులు పృథ్వియందును పృథ్వి
జలమందును జలమగ్నియందును నాయగ్ని వాయువందును నావా
యువు ఆకాశమందును నాఆకాశము మహాకాశమందును మహా
కాశము పరాకాశమువందును పరాకాశము తత్త్వాకాశమునం
దును తత్త్వాకాశము సూర్యాకాశమునందును సూర్యాకాశము
పంచమహాకాశాతీత పరబ్రహ్మమునందును దృఢముగా లీనమై
వంతట శుద్ధపరబ్రహ్మమే ప్రకాశించుచుండును కాబట్టి సీగురు
కీలకమును అవిద్యోపాదికులగుజీవులకు బోధించుటకై నాశుద్ధ
పరబ్రహ్మమే రామకృష్ణ నారసింహావతారము లెత్తి ఆయా
యవతారములలో ప్రత్యక్షముగా తనరూపుజూపి నారాయ
ణుండని పేరందె నా నారాయణుండు సుజ్ఞానతత్త్వ పూర్ణో
దయమును ప్రసిద్ధిజేయుటకై కర్మభక్తియోగ సాధనంబులు
ఆయాయవతారములయందు తమతమ శిష్యులకు బోధించియు

న్నారు కర్మయోగమనగా ఫలాపేక్షలేక సత్కర్మానుష్ఠానము చేయడము మొదటి సాధనమనియును అచంచలభక్తితో తన రూపుల దర్శించుట రెండవసాధనమనియును యింద్రియముల నిగ్రహించి ఆత్మను యాత్మయందే లయముచేయుట మూడవ సాధనమనియును బోధించియున్నారట్టి యనుభవమందిన యోగీశ్వరులు పరబ్రహ్మమునే బొందుచుండెదరని తీర్మానించి యున్నారు ఈసుజ్ఞానతత్వ పూర్ణోదయ తొల్లిచతుర్ముఖ బ్రహ్మ దేవతలకును సదాశివుడు పార్వతీదేవికిన్ని రామబ్రహ్మ మాంజనేయులవారికిన్ని శ్రీకృష్ణభగవాను లర్జుననకును యాజ్ఞవల్క్య మహాఋషి జనకమహారాజునకున్ను ఇట్లనేకమంది మహాఋషులు తమతమశిష్యుల కుపదేశమిచ్చియున్న సీసుజ్ఞానతత్వ పూర్ణోదయ భావవివేకముచే జాగ్రస్వప్నసుషుప్తి త్రయాతీతంబైన తుర్యంబునగాని దృశ్యంబాలోకనగాదని దృఢముగా బోధించియున్నారు (ఏకమేవా ద్వితీయంబ్రహ్మమనిన్ని) (ఓం మిత్యేకాక్షరం బ్రహ్మమనిన్ని) (ఏకాక్షర చతురక్షర పంచాక్షర షడాక్షర అష్టాక్షర ద్వాదశాక్షర పంచదశాక్షర) షోడశాక్షర మర్మముల స్పష్టముగా బోధించియున్నారు అట్టిబోధననుసరించిన శిష్యులుకడతేరి యున్నట్లనేక గ్రంథమ్ములలో వ్రాయంబడి సాదృశ్యములై కానంబడుచ్నువి.

పంచచామరం.—— పురాకృతంబు నంటిమాయ పోనగ జేయువృత్తులన్। నిరావరాభ్రులై మనంబు నిల్పుభక్తియుక్తిచే। గురూక్తినంటిబుద్ధినొక్క। కుహారమున్యజేర్చగా గరిష్ఠమైనప్ర

త్యగాత్మ గ్రాలుచుండు నెప్పుడుఁ॥

పంచచామరం.—— వరించి బ్రహ్మతత్పదంబు వాలుగంటిచూపులో। భరించి స్వాంపదార్థసాక్ష భావమైఖ్యసిద్ధిగా। స్మరించి ప్రత్యగాత్మనాటి స్వప్రకాశ చిత్తుడై। చరించు బ్రహ్మవిద్వరుండు తైప్రేముడై జగంబులఁ॥

పంచచామరం.—— సుసంగ హృదయమందిపొంద సూత్ముతే జబ్రహ్మమే। ప్రసంగ మందరానిశిన్య ప్రశంసాన్మలోకిడై। యొసంగుసూర్యచంద్రవహ్ని విష్ణువిలాసిన్నపా। యసంగు వందుమాయమాయ నందిపొంది మించిరఁ॥

వ. ఇట్లు సద్గురుస్వాములవల్ల సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ భావమును బోధింపంబడి అనుభవంబున జెన్నారియున్న బ్రహ్మవేత్తలు పూర్వజన్మకృత కర్మంబులు తుదముట్టం దహింపు జేసుకొని పావనులై యున్నారు గాన చిలుకపంజరంబున తప్పించుకొని పారుచందంబున నీసంసార పారావారమును సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమను నావచేదాటి నిస్సంగమౌన ముద్రారూఢ గుణరహితముగు గుట్టుచేరి బ్రహ్మానంద సుఖమనుభవించుచుందురు ఈలోకభ్రాంతియగు భార్యాపుత్రాది సంతానములు ప్రాణాపాయ సమయంబున తోడ్పడి రాజాలరు తాను జేసుకొనియున్న సుజ్ఞానమేతోడ్పడును గనుక స్వాత్మపూజాఫల ప్రయత్నమెంత దృఢమగునో నిత్యబ్రహ్మానందసుఖమంత సులభముగా సిద్ధించుచుండు జ్ఞానాగ్నిచే సకలదుర్గుణములు దగ్ధమైపోవుచుండును గాన బ్రహ్మానంద భరితాంతరం

గుండును యాత్రజన రక్షకుండును నగు గురుస్వాములవద్ద జేరి సాంప్రదాయకముగా సుజ్ఞానతత్త్వపూర్ణోదయ భావమందం దగు (తరతిశోకమాత్మవిత్) అను న్యాయముగానన్నా (జ్ఞానంవినా మోక్షస్సపద్యతి) యను న్యాయంబుల ననుసరించి ప్రాణులకై సాధనలు త్రివిధములున్న వందు మొదటిది (వైరాగ్యము) అనగా మనోవాక్కాయ కర్మంబులైన త్రికరణంబులతో యదార్థమాచరించి నడుచుచుండుట, రెండవది(భక్తి) వేదాంతశాస్త్రంబులయందును ఆచార్యునియందును విశ్వాసము గలిగి శుశ్రూషలు చేయుచుండుట, మూడవది (జ్ఞానము) స్వరూపాతీత సాక్షాత్కారమగు నిర్గుణమంది పరిపూర్ణుండై యుండుట, యిట్టి వైరాగ్యభక్తి జ్ఞానంబులుగూడిన భక్తుండగు జ్ఞాని మోక్షాస్పదుండగుచుండు నందుకై మనుజులలో నేకుతరగతులు గల గుణవికారులుండెదరు. ౧, పాషాండుడు. ౨, నిహలోకకామి. 3, పరలోకకామి. ౪, నిష్కామి. ౫, ముముక్షువు. ౬, అభ్యాసయోగి. ౭, ఆరూఢజ్ఞాని యని ౭. విధంబుల జీవులుండెదరు (మొదటిపాషాండుడు) విరుద్ధకర్మంబు లాచరించువాడు (రెండవనిహలోకకామి) పరలోకము మిథ్యయని భార్యాపుత్రాది సంపత్తులు శాశ్వతంబని నెంచుచుండువాడు (మూడవ పరలోకకామి) కర్మలాచరించి స్వర్గాదిభోగములు గోరుచుండు (నాల్గవ నిష్కామి) పెద్దలనాశ్రయించి వేదశాస్త్రముల పరిశీలించి ఆత్మదర్శనముగోరుచుండు (అయిదవముముక్షువు) నిత్యానిత్యవివేకపరిశీలుండై సాధనచతుష్టయ బ్రహ్మవిచారణ

జేయుచున్నందు (అద్వయభ్యాసి) మహావాక్యోపదేశంబులనంటి సకల మనిత్యమని దోసి బ్రహ్మమునందై యున్నను (మోదవ ఆరూఢజ్ఞాని) జీవన్ముక్తుండై శివోహం భావాంతర్గతుండై తన్మయానందమును బొందుచుండును.

పంచచామరం..... చనుప్రభూరిభేదమందు చంచమాయకాం
తిలో। మనోవికారభ్రమించి మహీలత త్వజ్ఞ పిచే। నవస్తి
భాంశ స్వైర్యమాని నందపొందమించెనా। సనాతనస్స మస్సి
తంబు స్వప్రకాశసిద్ధుడా॥

వ. ఇట్టి మహేంద్రజాల మాయాకల్పిత ప్రపంచంబున యోనిసంభవుండై జన్మించియున్నను స్వస్వరూపానుసంధానుండై ప్రకాశించు చుండెడు మహనీయ్యని చతుర్ముఖ బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వరులెన్నజాలరని చెప్పియుండు ప్రమాణంబులనేకంబులున్నవి:

శ్లో॥ స్వయం ప్రకాశమానాయ పూర్ణానంద ఘనాయచ।
నిరస్తాశేషతమసే మహ్యమేవ నమోనమః॥

వ. ఇట్టి స్వయంప్రకాశుండగు బ్రహ్మజ్ఞాన పూర్ణానంద ఘనుండు పరమగురువనుండైన సద్గురుండై (స్వయం తీర్ణః పరాంతరతి) యనురీతిగా తమదివ్యజ్ఞాన శరీరమునిచ్చి రక్షించుట వలన పరమగురువర్యుండే విశేషజ్ఞుడనియును సర్వజ్ఞుడనియును నిర్విశేషుండనియును స్వయంభువనియును సకలదేవతలు స్తుతించుచున్నట్లు వేదశాస్త్రంబులే నిదర్శనంబులై కానబడియెడిని॥

శ్లో॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం। శివశాసన
తశ్శివశాసనతః శివశాసనతః॥

వ. యనిశివకేశవులు సహా అట్టిగురుస్వాములను పరబ్ర
హ్మ స్వరూపంబుగా భావించుచున్నారట్లున (గురుబుద్ధిర్విశేషతః)
యనున్యాయంబుగా గురుస్వాములవలన సుజ్ఞానతత్త్వపూర్ణో
దయభావము గ్రహించుటకై యట్టి గురుస్వాముల శరణ్యుల
గు వారలు సర్వదోషంబులకు మూలంబగు దేహాభిమానమును లో
భంబును విసర్జించి క్రమముగ సాధనంబైన కర్మకాండమును
నన్న సద్యోగముగ సాధనమైన జ్ఞానకాండమునున్న సాధించి
(బ్రహ్మైవాహమస్మి) యనువాక్యానుభవము న్యాయంబగు నట్టి
పరిపూర్ణ బ్రహ్మానుభవమందుటయే (సుజ్ఞానతత్త్వపూర్ణో
దయము వాంఛించుట) నిర్గుణోపాసనయందు జీవేశ్వరులకు
భిన్నత్వమును నిర్గుణోపాసనయందు జీవేశ్వరుల నైక్యత్వము
నుసహజమైయున్నదని సనాతనమహాఋషులున్న బ్రహ్మవేత్తలు
న్న (ఏకమేవాద్వితీయం బ్రహ్మ)మనిన్ని (జీవోబ్రహ్మైవనా
పరః) యనియైకత్వమును కనిపెట్టి (సత్యమద్వైతం) సహజమ
ద్వైతం) బని శ్రుతుల ననుసరించివర్తించి పూజ్యులైయుండిరి
పైశ్రుతుల ప్రమాణంబులను నమ్మనివారలకు దుర్గతిప్రాపకమ
గుచుండునట్లున సూర్యబింబమునకు తత్ప్రతిబింబమునకును కాల
త్రయములయందును యేకత్వము సహజమగదా అట్లుఘటజలం
బున వేఱైకానంబడియెడి సూర్యనిఘటమున జలము లేనప్పుడు
సూర్యునందు మాయమగు చందంబున సుజ్ఞానముతో నాశిన

జీవుండు చెక్కు చెమర్పక చిదానందనిలయ ప్రకాశమునందులీన మగుచుండుట సహజమైయుండుటంబట్టి సత్కర్మానుష్టానమువల్ల నుత్తమజన్మప్రాప్తియును యజ్ఞాదాది క్రతువులవలన స్వర్గాది భోగములును కేవలభక్తి మార్గమువలన సాలోక సామీప్య సారూపసాయుజ్యంబులును అష్టాంగయోగసిద్ధివలన సాక్షిత్వమును కేవల సుజ్ఞానతత్వపూర్ణోదయమువలన విదేహకైవల్యమును సంప్రాప్తమగుచుండును వైకుంఠకైలాసాది మహోన్నత పదవులుకూడ (బ్రహ్మసత్యం జగన్మిథ్య) యను న్యాయంబుగా నింద్రజాల మహేంద్రజాలంబులగు పదవులేయై యున్నవి గాని శాశ్వతంబులుగావు (అనిత్య ఫలతుల్యంబులై యున్నవి) గనుక జననమరణ రహితంబులైన నిర్గుణబ్రహ్మతత్వ స్వయం ప్రకాశమే విదేహకైవల్యము సిద్ధిదేహకైవల్య మార్గంబట యే సుజ్ఞానతత్వ పూర్ణోదయమందుట యిట్టిజ్ఞాన మార్గంబుటకై తొందరపడి తనుస్థమైన స్వయంప్రకాశ పరబ్రహ్మ సిద్ధుండగు గురువునాశ్రయించి పునస్సనరహితుండై జగంబులు మిథ్య యని కొండమావులచాడ్పున గ్రహించి ద్రష్టయై స్వయం ప్రకాశ మయుడుండవలె శిష్యులకు బ్రహ్మవిద్యా గరిష్టుండవం బరగు లేక పజ్ఞానతిమిరంబుపన్నగిలి భ్రమించిన వారలకు జగద్బాహ్యాంతర వ్యాపక పరబ్రహ్మంబు గోచరించుట దుర్లభంబై ఘోరరుచులచే చేటొందుచుండెదరు కాబట్టి మనము చెడబడక చమత్కారులమై కృపాంతరంగుండగు గురుస్వాముల నాశ్రయించి అనన్యాపేక్షులై తనువాడి రాగద్వేష దూషి

తుల్యమై మనోవాక్కాయ కర్మంబుల నొకప్పుడైనను దోషం
బుల కియ్యకొనక మృగతృష్ణికా ప్రవాహంబుగాంచి భ్రమ
పడి తేకున్నను మెలంకువతో లోకవిగ్రహితంబైన పాపముగరు
వను చింతకు చేరంజని నిటలతట ఘటితాంజలిపుటుండై నధ్యా
త్మ యోగసాధన త్రికరణశుద్ధిగా గ్రహించి సుజ్ఞానతత్త్వ
సంసర్గోదయ మందుచుండందగు నందుకై నిగ్గుదలంపమి శీలం
బనబడు శీలంబువలన ధర్మంబు నెగడు ధర్మంబువలన సత్యంబుగ
లుగు సత్యంబువలన సర్వకార్యసిద్ధియొనగూడు కార్యసిద్ధివల
న చిత్తచాంచల్యంబడంగు చాంచల్యమడంగిన మోహం బడఁచే
గీత సూక్తులు॥

గీ॥ సత్సమాగమము వలన సుజ్ఞానమొదవు।
జ్ఞానమువయించువలన నజ్ఞానమడగు।
పోగ నజ్ఞానమడగిన భ్రాంతియడగు।
భ్రాంతియడగిన బ్రహ్మంబు బట్టబయలు॥

వ. కావుట్టి ముముక్షువైన కాంతాళి మపంచనవలె నట్టికోప
సప పాపముల కాదరవైరంబున్న యాటి (పతీనాం కోప చాండాలః
స్త్రీమారిణాపం వివస్వినాం) లనిమహాత్ములు వలుకదురు కృమ
యెల్లకార్యములకు (పరోక్షదయాలి) నాయురవసానపర్యంతము
చిదాత్మావలోకనంబునవ్వారి శివరుడైయ ధృవంబులగు దేహం
బులచే ధృవంబగుకీర్తినార్జించి నిఖిలహేయభాజనంబై బు
ద్బుదసమానమై క్షణభంగురంబైయున్న నీకాయము కల్పస్థాయి
గాదు (అస్థిరం జీవనం లోకే అస్థిరం యౌవనం ధనం అస్థిరం దార

పుత్రాది ధర్మస్యస్వయం(స్థిరం) గనుక జీవేశ్వరజగత్తులు సద్గురూపదేశమువల్ల క్రమక్రమముగా నెఱింగి దృఢపరుచుకొను చుండువారలే బ్రహ్మవేత్తలు (బ్రహ్మైవాహాస్మి) యనుబ్రహ్మవంద భరితాంతిరంగులరై విదేహకైవల్య మందుచుందురని గ్రహించుచుండందగు అట్టి యోగీశ్వరులుండు నీవిమొట్లన (ఆనందనిద్రే జగదేకనిద్రే సముద్రనిద్రేవిదేహనిద్రే శ్రీయోగనిద్రే రమతే మనోమే) యను యోగనిద్రలో (సచ్చిత్తశాయిభుజగేంద్రశాయి నందాంతశాయి కమలాంకశాయి శ్రీరంగశాయి రమతేమనోమే) యనిపరమానంద మనోల్లాసులై విదేహముక్తిజైడి నిత్యతృప్తులై విహరించుచుందురు॥

గురుశిష్య న్యాయవివరణము.

శ్లో॥ అనంతజన్మసంప్రాప్త కర్మేంధన విదాహినే। జ్ఞానానల ప్రభావేన తస్మైశ్రీ గురవేనమః॥

శ్లో॥ జ్ఞానశక్తి సమారూఢో తత్త్వమాలా విభూషితం। భుక్తిముక్తి ప్రదాతాచ తస్మైశ్రీ గురవేనమః॥

శ్లో॥ అఖండసచ్చిదానంద మవాఙ్మనసగోచరం। ఆత్మానమఖిలాధారం తస్మైశ్రీ గురవేనమః॥

సీ॥ పిల్లికూనలు బెట్టి పిల్లలకుపాలెట్టి యిమ్మైనచోటుకు వెతకులాడు। తావుకుదిరినవెనుక తానోటకరుచుకొని పోయినవిల్లలను బహుపోడిమిగను। పోషించుతనవిద్య పూర్ణంబుగా చెప్పి పైకాపుకాశి పైపై నిదిరుగు। తల్లితోసరిమైనతావిడిచి పోవువట్లు ముల్లోకములకుగురు మూలవిద్య। చెప్పిశిష్యునిత

సరూపు చేరగాను। యప్పుడీరివసంసారి యవనిదిరుగు।వటు
ల శిష్యుని దిగనాడి యాత్మకృతిని। తిరుగుస్వేచ్ఛావిలాస
ముక్త దేశికుండు॥

గీ॥ కారణాచార్య పాదంబు గనుటమేలు।
వాక్యబోధలు విద్యసంపాదనగును।
మీద ఫలమిచ్చు నాతను మీఱియుండు।
తానద్వైతంబు గురువని దలపవలయు॥

ఉ॥ ఆగురుశేవ చేయుమను యాత్మనుగోరిన విద్యలన్నియుగా।
వేగమెనేర్చి బ్రహ్మనెల వేర్పడగాంచుము తత్త్వసిద్ధుడై।
భోగముగోరినగలుగుపూర్ణముగానువహింపచేయుదో।
గాగమపూజ్యదాతనని గాంచుముపుణ్యాతను ప్రవీణుడై॥

వ. గురువులుమొనమంద్రుగురు మొదటి(బోదకగురువు)
శాస్త్రశబ్దార్థములను దెల్పుచుండు, రెండవ (వెదకగురువు)
తత్త్వములనుదర్శింపజేయుచుండు,మూడవ(నిషిద్ధగురవు)వశ్యా
కర్షణా దృష్టకర్మలచేత నిహపరములయందు మోదభేదంబుల
నిచ్చునట్లు బోధించుచుండు, నాల్గవ(కామ్యకగురువు) పుణ్య
కర్మోపదేశములను బోధించుచుండు, అయిదవ (సూచకగురు
వు) శమదమాది సద్గుణములగు విజ్ఞానముకు బోధించుచుండు,
ఆరవ (వాచకగురవు) ఆత్మానురాగము గలుగునట్లు బోధించు
చుండు, యేడవ (కారణగురువు) శివజీవేశ్వర సంధానజ్ఞానము
ను బోధించుచుండు, యెనిమిదవ (విహితగురువు) సంశయ
ములదొలంగించి నిత్యముక్తిని ఘటింపజేయుచుండుగావ కార

డాచార్యుండగు పరమగురుని సన్నిధికి జేరంజని శరణ్యుండై పాదములపైబడి శిరస్సాష్టాంగ దండప్రమాణంబు లాచరించు టచే (శిష్యుండు తనమనస్సాక్షిగా ప్రాణమును దారవోసినని తనశిరస్సును పాదములపై బెట్టి ఆచార్యుని యాజ్ఞానుసారముగా జవదాటననియును వారివాక్యముల శిరసావహించి నడుచుచుం దుననియును ప్రమాణము చేయుచుండు) శిష్యుని దయాపూర్ణుండగు గురుస్వామి శిష్యునిశిరస్సున తనకరమునుంచి (హస్తమస్తక సంయోగముచేయుచు దడవుచింతించితలపంకించి కలశాబ్ది సముద్రైక్యకరుణుండై పూర్ణానుభవసిద్ధిం గలుగ జేయుదు నని యంగీకరించి [శీఘ్రమేవ జ్ఞానానంద ఫలసిద్ధిరస్తు శుద్ధచిత్తోభవ] యని ఆశీర్వదించి కరంగటజేర లేవనెత్తిన తోడనే శిష్యుండుద్రోయిలించి వినయంబుకరకొ తనిలువంబడి మీయాజ్ఞజవదాటిన (గురుద్రోహి నగుదుననియును పట్టినపట్టువిడము ట్టం జూతుననియును) జెప్పుచుండెడి శిష్యుండు మోక్షాపేక్షనీ యుండగుచుండునట్టన.

శ్లో॥ తాదృశం దేశికం సాక్షా ద్వేశ్వరం బుజ భాస్కరం। తోష
యేత్సర్వయత్నేన శ్రేయసే భూయసేనరః॥

వ॥ అనగా దేశికస్వాములమనంబున పూజించువానికి శుభంబును శ్రేయంబును గలుగును॥

క॥ సద్గురుకృపచే నెప్పుడు। సద్గతిదీపించుచుండు చాలాచదువు
లే। సద్గతిగలుగగ జేయునె। సద్గురువే దైవమనుచు జాటర
వేమా॥

క॥ గురువులలో దోషంబుల। నరయుట వృథసమ్మివారి యమలో క్తులనే। శిరసావహించి వినుచును। బెరవిషయము లన్నిగూ డ వీడగవలయుఁగా॥

తే॥ మానసము వాక్కు గాయంబు మంచిస్థితికి । దెచ్చి నిర్మల ముగ జేయు దివ్యబోధ। ముక్కటివె జ్ఞానమన జెల్లు నొం డుజ్ఞాన । మంతయునుగూడ నజ్ఞాన మనగవలయు॥

గీ॥ ఎవ్వరెవరి గుణము లేమైనమానరు । చక్కఁబెట్టవశమె ఉక్కతోక । గదుసురాలుమగని గంపబెట్టమ్మదా। విశ్వ దాభిరామ వినరవేమా॥

శ్లో॥ ఇదంతేన తపస్కాయ నాభక్తాయ కదాచన। నచాశి శ్రూష వేదాచ్యం నచమాం యోభ్యసూయ్యతి॥

వ. అనగా గురూ క్తిగాదగిలి శిశ్రూషచేయుచు సుజ్ఞాన తత్త్వ పూర్ణోదయ మందుచుండందగు॥

క॥ తనువుపోషించుటకై । దనవంతుని గొల్చుభంగి దగమనుజు డోగిగా। మనమగు ముక్తికిగురుపద। వనజములగ బ్రొక్క నగును వసుధలోనెపుడుఁగా॥

క॥ నరజన్మమెత్తినందుకు। గురుసేవను భక్తిమించి కొందలపడ కగా। స్థిరమార్గమూనిబుద్ధిని। వరితుష్టిని బొందువాడె భక్తుం డిలలోగా॥

శ్లో॥ గురుమూల ప్రపంచస్యా ద్గురుమంత్ర వినాపృథక్। గు రుపూజా గురుధ్యాన గురుమంత్ర పరాయణః॥

శ్లో॥ గురుపాదోదకంపీత్వా గురుశేష గురుప్రియా। గురుత
ర్పణ శుశ్రూష గురుహోమణ కీర్తనః॥

శ్లో॥ గురుర్నాస్తి వర్ణానాం గురుర్నాస్తిసత్పరం। గురుహీ
న నచాద్రాహ్యం గురుపర్వత్రిసాధనా॥

శ్లో॥ గురుదక్షిణ మైశ్వర్యం గురువర్ధన మాశ్రయం। గురు
ధ్యాన మహాపుణ్యం గురుశుశ్రూష కారణం॥

శ్లో॥ గురుధ్యానయశోవృద్ధి గురుమంత్రవరంతథా। గురుతీర్థం
మహాపుణ్యం గురుశేషం మహత్ఫలం॥

శ్లో॥ గురుపూజవినాదైవం గురుపూజ వినావరం। గురుపూ
జ వినాయోగం గురుపూజ వతాంత్రికం॥

—* గురుపూజవినాసర్వం నగోచరనవర్తతి. *—

శ్లో॥ గురోపరతనాస్తి సత్యసత్యంవసంశయః। గురుపాదోద
కంపీత్వా గురునామ సదాజపేత్॥

క॥ ఉదయాత్పూర్వమెనిద్దురి। వదిలియువిణ్మూత్రములను వర్జిం
చితగ। రదనములు తోమిశుభ్రమై।కదలకగురు భక్తిస
లువ గావగుభువిలో॥

గీ॥ మేఘమడ్డమైన మిహిరునిజెరుచును। చిత్తమడ్డమైన స్థిరము
తెలుపు। మలుపులడ్డమైన మరిముక్తి తెలుపరా। విశ్వ॥

క॥ నిజమాడుచుండువారలు। సుజనులైలోకమందు శోభింతు
రుగా। భజయించి గురునిగన్గొని।భుజగర్వము పొత్తుమరువ
పోలియు గుణంబుల్॥

క॥ వినుభృగుసుతుడు గావింపని । పనులకునైన నుదిరెట్లు ఫల
మొనరించుఁ । జనములు గార్యమునడపగ । ననుకూలత
నిచ్చుగాక యాయుర్యాయిఫలముల్॥

క॥ గ్రుతమువలనశ్రోత్రియుడగు। నతులతపోయు_క్తిగడు మహా
త్వముబడయుఁ । ధృతిచేసహాయ యుతుడగు । నతిశయ
ముగ బుద్ధిమంతు డగుబుధసేవఁ॥

వ. బంగారమునందు కల్పితంబులైన కటకకుండ లాభ
రణములు వేర్వేరైనను బంగారమే ప్రధానమైన రీతిగా పర
మాత్మయందు పిండాండ బ్రహ్మాండములు వేర్వేరైనను బ్రహ్మ
మేప్రధానమైనట్లు గురుస్వాముల బోధచే నెఱింగిన పరమాత్మ
జడములైన యింద్రియముల కగోచరుండు రాగద్వేషరహిత
మైన సూక్ష్మబుద్ధికి గోచరుండగును జగమునందు సూర్యకాంతి
లో తనతనవ్యాపారములను చేయునట్లు దేహేంద్రియ మనో
బుద్ధులకు ఆత్మసాన్నిధ్యమువలన వ్యాపారములు గలిగియుండు
ఘటపటాదులు దీపప్రకాశమును చూడంజాలనియట్లు మనోబు
ద్ధ్యాదులు ఆత్మను చూడంజాలకగదా దీపమును చూచుటకై
వేరదీప మవశ్యముండనియట్లు ఆత్మదర్శనమునకు మఱియొక
ఆత్మఅవశ్యము వుండదు కాబట్టి శ్రీగురుమన్నధర్మ మెఱింగి(నిర్గు
ణమైశుద్ధమై బంధవిము_క్తమై ఏకమై సంపూర్ణమై వెలింగెడు
పరబ్రహ్మమునకు) బుద్ధిధర్మములు లేనందున నిర్గుణుండనియు
ను యింద్రియములు లేనందున వ్యాపార శూన్యుడనియును
నాశము లేనందున నిత్యుడనియును మనస్సు లేనందున నిర్వికల్పుం

డనియును ప్రపంచసమ్బంధములేనందున దోషరహితుడనియు
ను వికారస్వరూపంబైన లింగదేహము లేనందున నిర్వికారుం
డనియును భ్రాంతిచేత పరబ్రహ్మంబునందు ప్రపంచంబుదోచు
టలు గురూక్తివల్లగ్రహించి భ్రాంతితొలగించు కొనుటయే
జీవికి జీవన్ముక్తి యిట్టి ముక్తిని సాధించుటయే వేదాంతము వే
దాంతమనగా సత్యము సత్యమును నిరూపించు గ్రంథములే
వేదంబులు వేదంబులు మెరుకచేసంగ్రహించి మెరుకనుమరచి
చలించకయుండుటే అచలము అట్టిఅచలమైన పరాపరాత్మయే
పరబ్రహ్మమైన నారాయణమూర్తి నామూర్తిని తదేకధ్యానం
బున చింతించి నిర్విణ్ణుండై యుండుటయె సుజ్ఞానతత్వ పూ
ర్ణోదయంబను విదేహముక్తి॥

గీ॥ పగలురేయిమాఱచి భావంబుమఱచి। తానునేనుయున్నత
లపుమఱచి। యుండువాడునెంచయుత్తమయోగిరా। విశ్వ॥

ఛాయాపురుష లక్షణవివరము.

శ్లో॥ రవిర్నారాయణస్తేజః చంద్రోనారాయణోమహః।
వహ్నిర్నారాయణసాక్షా న్నారాయణనమోస్తుతే॥

శ్లో॥ హృత్పద్మనిలయోజ్ఞానాం, దూరస్థఇవబాలిశః। ప్ర
మాణాతీతసద్భావం తంవందే జ్ఞానసాక్షిణమ్॥

శ్లో॥ నమస్తే దేవదేవేశ సర్వవ్యాపినిరంజన। సత్వాదిగుణ
భేదేన లోకవ్యాపారకారణ॥

సీ॥ అష్టపాదచ్ఛాయ లందునెదుర్రై నిలచి గళంబునందొక్క
ఘుంటజూచి। అపైనియాకాశ మాతిరుగాచూడ ఆకార

సంగమంబు లన్నియున్న । తనకుతాకుటుంబము తాలిమిగా
నుండు అంగంబులందునే భంగమున్న । గర్భమందున
బిలముగానగా సంతాన కుడిబాజుతో బుట్టువులకు నెడమ
బా జక్క చెల్లెండ్రుగళము తనకగునుఫాలంబు . భార్యాను
పాలుగాను। ఆరుమాసాలలోపల నమర్పైన। దండధరుదేశ
మందగా దారిబట్టు । చీకలైనతనతండ్రి శీఘ్రిమేగు।
రుదులు చెడియున్నతల్లికి రూపమడగు॥

౮. ఇట్లుశివాగమ శాస్త్రంబున జెప్పంబడియున్న ప్రకారము గురుండుఛాయాదర్శనముచేయించి శిష్యునకు శుభ శోభ లక్షణంబులు తెలుపుటకై ఆకాశమునందు మబ్బులేని సమయంబున నిర్జనప్రదేశము జేర్చి సూర్యుడు వెన్నంటియుండునట్లు శిష్యునినిలిపి ఐదు అడుగులు మొదలు పదునొకండడుగుల నీడ వరకు ఛాయచూడవచ్చునని దెలుపుచూ చేతులను ధారాళముగా విడిపించిగాని నడుమునకుచేర్చిగాని చేతులనుపైకెత్తించిగాని నిలుచుండజెట్టి యానీడను భూమిపై జూపి కంఠస్థానమునందు దృష్టినిచెదరనివ్వక శిరస్సుమొదలు దేహమాద్యంతముపై చూపునిలుపుమని(ఓం హ్రీం పరబ్రహ్మణే నమః) యను మంత్రము నుపదేశించి నూటయెనిమిదిమార్లు జపింపంజేసి ఛాయయందు దృఢమైన దృష్టినిలిపినపిమ్మట ఆకాశము నందు శిష్యుని యెదురుగా శిరస్సునెత్తి చూడంజేసి నీటిలో తళతళమను తనఛాయ కనుపడుపోల్కెగా స్ఫటికపుఛాయ వర్ణిలి చూపించి శిష్యుని రూపుకనుగొన జేయును ఆఛాయ శిష్యుండే

ప్రకారమునిలువంబడి చూడఁబడునో యారీతిగాఁ గనుగొనవలె
సును అటువలెనేచంద్రోదయమైన తర్వాతఅయిదు కొలఁదులుపద
నొకండడుగులవరకును చూడవచ్చునని తెల్పుచూ దర్శింపంజే
సిన ఛాయాదర్శనము నారుమాసములు పైమంత్రోచ్చారణ
తో నిర్మలమనస్కులై చూచెడువారలు సాంబమూర్తిదర్శ
నమునందుదు రనియును నట్లే రెండుసంవత్సరములు దర్శించిన
కాలత్రయ సుఖదుఃఖముల నెఱుంగుదురనియును నిరంతరము
ధ్యానించు సత్పురుషులకు సదా చిత్సౌఖ్యానందముంది త్రిలోక
పూజ్యులై చరించుచుందురనిబోధించి కృష్ణవర్ణఛాయచూచిన
నారుమాసములకును పాదములు కనుపడకపోయిన నారుమా
సములకును మోకాలు కనుపడకపోయిన సంవత్సరమునకును
కడుపుకనపడక పోయిన రెండుసంవత్సరములకును మృత్యువుసం
భవించునని చెప్పి పసుపుఛాయకనుపడిన రోగభయమనియును
రక్తఛాయకనుపడిన చిత్తభ్రమయనియును కుడిభుజము కనుప
డకపోయిన తోబుట్టువులకు హానియనియును యెడమభుజముకను
పడక పోయిన భార్యకుహానియనియును శిరస్సు కుడిభుజముక
నుపడకపోయిన శిష్యునకే ఆసన్నమృత్యువనియును తలకనుపడ
ని ఆరుమాసములకు పిక్కలునొకదినమునకు సర్వాంగముకన
పడకపోయిన తక్షణమే మృతిజెందుదురనిన్ని ఛాయమలినము
గాకనుపడిన వ్యాధిదోషమనియును తెలుపుగా కనుపడిన ఐ
శ్వర్యమనియును రంధ్రములుగా కనుపడిన శస్త్రఘాతముకల్గున
నియును జీవమున్నట్లు మెరుపులీగవలె పొగగప్పినట్లు కనుపడిన

క్షేమమనియును ముఖము మరియొకవైపున యున్నట్లు తోచిన రోగభయమనియును బోధించి సూర్యచంద్ర దీపపు కాంతుల లో నీల్లుచూచి గ్రహించవచ్చునని యుపదేశించుటే గాక కుడిముక్కు రంధ్రమున వాయువు ౩ దినంబులు వచ్చుచుపోవుచుండి నగ్యదినంబులకును రెండురంధ్రములగుండా మారిమారివచ్చుచుండినదయముగా నుండుననియును మూరక రెంటిలోనడుచుచుండిన మూడుదినములకును నిరంతరం ప్రభలముగానడిచిన నెలకును నోటిగుండానడిచిన రెండుదినములకును మృత్యువు ఆసన్నంబగుననియు తెలియబోధించి రక్షించును పింగళనాడి ౧గిదినములాడిన త్వరలోమరణము రెండు నెలలాడినను యిడానాడి మాసమాడినను సంవత్సరమునకు మరణము సిద్ధమనియెరింగించి ఇడానాడి పదిదివములు నడిచిన మూడుమాసములకును మూడుమాసములునడిచిన యాడాదికిని మరణమనియును సంవత్సరాదిని స్వరముచంద్రుడాడకుండిన హాని అష్టమివారం స్వరము లేకయున్న నష్టము విదియ లేకున్న ధననాశము తదియ లేకున్న భయముచవితివారస్వరము లేకున్న బంధువైరముచే బాధగలుగును పంచమివారస్వరము లేక యుండిన చంచలమును రాచకలహము భవనష్టము షష్టివారస్వరము లేకపోయిన సంకులము సప్తమివారస్వరము లేకపోయిన దేశాటనము గల్గునని బోధించును యిదిగాక సూర్యబింబము జలమందుచూచిననిండుగాకమపడిన ఆయురారోగ్యమనియును ప్రక్కలులోపమయినఆరు లేక రెండునెలలకుమృత్యువనియును రంధ్రములుగా దోచిన పదిదినముల కనియును

ధూమ్రముగా కనుపడిన అయిదు దినముల కసియును మంట
యుండినట్లుండిన నొకదినమేననియును మరణహేతువులనిబోధిం
చి (ధృవుడనగా ముక్కుకొన గానరాక పోయినను) (అరుంధతి
యనగా నాలుకకొనకానరాక పోయినను) చంద్రబింబము చాక
ముగాకనుపడినను చెవులఘోషము వినబడకపోయినను మృత్యు
లక్షణములనిబోధించును గనుక శ్రీఛాయాపురుషసుజ్ఞానతత్వ
పూర్ణోదయమందినవారలు దేహము విడిచెడువ్యాళ దేహాదే
హములనుండి తొలగునదిగుర్తెరింగి దేహమస్థిరమని దేహాభ్రాం
తితొలగించుకొని పరబ్రహ్మానంద సుఖమును బొందెదుకోర్కె
చేపరమగురూక్తులనునమ్మి స్థిరచిత్తులై బ్రహ్మానందమును బొం
దటకనిదియే నిజమైనమార్గముగా దెలియజెప్పె నీటియందలి
బుద్బుదంబు నీటియందే గలియుచుండునట్లను మధురమైన జలమునం
దునానారుచులు గల్పించినను నానారుచులను బట్టివేర్వేరురూ
పములైనను జలమేప్రధానమైనట్లు దేహము బుద్బుదసామ్యము
దేహమున్నంతలో కైవల్యమార్జించఁదగునని బోధించును.

శ్లో॥ (పూర్వజన్మ కృతంపాపం । వ్యాధిరూపేణబాధతే)
యనున్యాయంబుగా జీవులు పుట్టిగిట్టుచుండుటకు కర్మధర్మా
దిరూప పురుషార్థంబులు ఆదిమూలంబులు శ్రుతిస్మృతిపు
రాణాగమోక్త నిత్యనైమిత్తికాది సకల ధర్మంబులు పరమపు
రుషార్థంబులు మోక్షమును సిద్ధిపొందుటకై సుజ్ఞానతత్వ
పూర్ణోదయము కారణమైయుండు నిత్యనైమిత్తికాది కర్మా
నుష్ఠానంబులు గురూపదేశంబున సాధనంబులైయుండు నెంత

టి సుజ్ఞానులకైనను రోగపీడలు చలన కారణంబులై ముక్తి సాధనకు విఘ్నంబులై బరగుచుండు రొక్కడజూచిన పెక్కలగు రోగులు పిక్కటిల్లుచుందురుగాని నిజమార్గయువార లు నూటికొక్కండైనను చిక్కట యక్కజంబై యుండు జీవికి పూర్వజన్మమందలి జ్ఞానము పుట్టునప్పుడే యోనిస్పర్శన మువలన క్షీణమై (జ్ఞానరూపంజసంశయః) నాశమునొందుచుం డును కాబట్టి నావమార్గమునుదాటించుటకు కర్తగురుండే దేవుండై ప్రకాశించుచుండునట్టి గురుస్వాముల నాశ్రయించి సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమునంది కైవల్యమందుటయే బ్రహ్మమైన ముక్తిగా నెన్నందగు॥

క॥ పాపముజేసిన దేవుడు। గోపించును పూర్వమందు కుంభినిలో వగ । కాపియగు రావణాసురు । డావదలగ బొందికుండె నన రేభువిలోన॥

క॥ హరిభక్తిచేతగొందరు। వరిమార్గరు మొదలుముట్ట పాపంబులని। స్థిరతరపరముల నూర్యుం। దరుదుగ బెనుమంచుపింఛ మదచినభంగిగా॥

వ. అనురీతిని సుజ్ఞానతత్త్వ పూర్ణోదయమును శ్రీగురుస్వాములచే గ్రహించి కైవల్యసాంబ్రాజ్యము నార్జించదగు॥

## —* గురూపదేశ సంగ్రహము.

శ్లో॥ అజ్ఞానతిమిరంధస్య జ్ఞానాంజన శలాకయా॥ చక్షురున్మీలితంయేన తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తయేనచరాచరం। తత్పదం దర్శనంయేన తస్మైశ్రీగురవేనమః॥

శ్లో॥ బ్రహ్మవిష్ణురుద్రశ్చ ఈశ్వరస్యసదాశివం। ఏతేగర్భగత శ్చైవ తస్మైశ్రీగురవేనమః॥

క॥ నాస్తికుడుపలుకు బ్రహ్మము। నాస్తియునే నాస్తియగున నైజము బ్రహ్మం। బాస్తికత లెచటదోఁచిన। వాస్తవమచ్చ టనెగాన వచ్చును భువిలోఁ॥

క॥ టాటోటు వానిమాటలు। కోటలుదాటించుచుఁబురుగు కొట్టిన పైరుల్। పాటింపగింజలొసగని। మాటగతిందనరు సంద్రు మదినెంచదగున్॥

క॥ పరిగానిచోటుకేగుట। గురునింద రొసిర్చుటయును గొంకకపరులన్ ధరపరిహాసించుటయుగల। పురుషులకవిదుర్గుణములు తొలియించతగున్॥

క॥ కాకముకోకిలయగునా। యాకలములు దిన్నకుంత యార్యుండగునా। పాకముచెడ రుచియగునా రూకలుగలలోభిధర్మరూఢుడెకెవుమా॥

క॥ చిత్తరువుగతినిగదలక। చిత్తము యిరవొందవినుచు చిత్రార్థములన్। మత్తిలకను చుంగురునెడ బత్తినిసలుపంగ ఫలము। బడయగవచ్చున్॥

క॥ భయమంతాజీవునిదే। భయముడిగిన తత్వమెల్ల పరమాత్మునిదే। లయమంతాదేహముదే। జయమంతాజీవిదనుచు జాటరవేమా॥

క॥ తనువును పోషించుటకై । ధనవంతుని గొల్చుభంగి దగమను
జూడొగిన్। ఘనమగుముక్తికి గురుపద । వనజములన్ బ్రొక్కు
నంత వర్ధిష్ణుడగున్॥

క॥ మూషకమెచ్చినబిల్లియు । దోషంబని తినక విడునె దోషుల
నటులన్। శోషింపయముడు పట్టగ। ఘోషించిన విడువబోడు
గొంటుల నపుడున్॥

గీ॥ మంటిలోహమందు మాకులు శిలలందు । పటము గోడలందు
ప్రతిమలందు । తన్ను దెలియుకొరకు దగలదా పరమాత్మ।
విశ్వదాభిరామ వినర వేమా॥

క॥ పారతు శివుమది నెంచిన । మారని కైవల్యమబ్బు మహిమ
యు బెరుగున్ । పారును దుర్గతిదూరము। గౌరివశివనామమె
పుడు గురియించు శిరుల్॥

క॥ పాపము చేయుచు నెవ్వడు । పాపమువలుకుచును దగిలి పావ
ముమదిలో। నాపాదించుచునుండెడు। పాపాత్ములకిహపరార్థ
ఫలములుగలవే॥

—[*] కందార్థములు. [*]—

పరతత్త్వభావమందిన । మరుజన్మము రాదుగాన మనుజులకెల్లన్। గురుచరణకమల సేవయే। దురితహారంబై నదారి ♦ దొరికెదెయరుదు ♦ దుర్మతులలో ♦ బరిగి తేనిలదు ♦ యురమున గురిగను। యుపము నెమ్మది నిల్పి। స్థిరబుద్ధినమర్చి। సేవింపవొరకొను। పరమనిర్గుణభావుడై గురి । పట్టిజూపును మొఱుకదోలు

ను । కరణముల ఖండించినమ్మది । బ్రహ్మంబనను గోప్యము ♦
దాటికేదయినదు ♦ దుర్మధులలో ♦ బిగిచెనిలదు ॥ ౧

తనయాత్మ భావమెఱుగని మనుజుని బ్రతుకేటి బ్రతుకు
మదకరివిధవమా । ఘనమైన మోహపు త్రికి । నడువుగరిలవిూద
నింపు ♦ టవిదెచందమురా ♦ మూఢులకెల్ల ♦ నిడిదెబంధ
మురా ♦ హృదయసంకల్పము । లుడుగనివారికి । ముదిరలపై
దృష్టి ముక్కునుచుండును । కదలనివ్వక కంటిపాపను । గది
యనొక్కయు త్రిపుటికెక్కక । సదయహృదయ సమాహితంబ
గు । సర్వమును మది నెన్నకుండిన ♦ నదియె చందమురా ♦ మూఢు
లకెల్ల ♦ నిదియె బంధమురా ॥ ౨

జినశాస్త్రల మాటలు । వినవేంకనారలు తెంది వివశా
త్ములై । వినువెంట నిరుగుచుండెడి । దనుజునకేబోధ చెప్ప తగ
దుమాయయ్యా ♦ టుప్పుష్కి వగటగునయ్య ♦ అగచాట్లనెం
చక వన్యతములాడుచు । నిగుణాత్తగోడను । నీల్గుపర్యంతము ।
జగతిలోనఁబుట్టుచావుల । జాడెరుగని మూర్ఖచిత్తుడు । తగ
దుసామ్యము సంధ్రిమించుచు । దగులుకొను ఫలివశునకునిది ♦
తగదుమాయయ్య ♦ మద్బుద్ధి ♦ వగటగునయ్య ॥ ౩

శ్రీగురువాక్యవిశేషము । చేగాకపరానుభూతి చెందరు
మనుజల । రోగములో గురియగుచు । త్యాగముననుకో
ర్కలిడి ♦ తమమెఱుచుమయ్య ♦ నియతాత్ములై ♦ భ్రమ
లణచుమయ్య ♦ బోమముడి పైదృష్టి బూనిగుర్తించెదు । విమల
నిర్గుణమూని । విజ్ఞాతుడై యుండు । శమదమాదికగుణ కదంబము ।

శక్యంబగునిత్యసుఖమున । క్రమముగా శేలాడివలనగాని। కా శలంబగుధ్యానపరమున♦ తమమణుచుమయ్య♦ నియమాత్మ డై ♦ భక్తిమలణచుమయ్య॥ 8

శ్లో॥ (హృదయేకల్పయేద్యో తస్మిన్ సర్వసుఖం లభేత్॥)

ఎ. భక్తిచే హృదయపుండరీక పుష్పము మధ్య పూజ చేయుడము మూడువిధంబులందు బాహ్యభక్తి అనగా (పరోక్షభావముగా పూజించుట) 2 అనన్యభక్తి అనగా (అపరోక్షభావముగా ధ్యానించుట) 3 ఏకాంతభక్తిఅనగా (సద్రూప చిద్రూప పరబ్రహ్మమును శక్తికొలదినే కీభావజ్ఞానంబున నిశ్చయముగా నెంచి పూజించుట) ఇట్లు మానసంబున ఆత్మా రాధనచేయుంచగు॥ (శ్లో॥ శ్రవణంకీర్తనంవిష్ణో స్మరణంపాద సేవనం। అర్చనం వందనందాస్యం శక్యమాత్మనివేదనం॥) బను వ్యాయాను గుణ్యంబుగా నారాధనచేయునట్టి ప్రత్యగాత్మ నిద ర్శనానందములో శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు 5 అధ్యాత్మిక ము రాగాదికర్మేంద్రియములు 5 అదిభౌతిక మనసాద్యంతకర ణములు 4 కూడి అదిదైవికవిషయ దుఃఖము లాత్మకంటవని స ర్వేంద్రియములను తాభక్తివంధంబున స్వాధీనములోనుంచు కొని యుండుస్థిరప్రజ్ఞులు ధ్యానారంభములో దేహమను దేవా లయంబుగా నెంచి యేకాంతస్థానముజేరి మనోవృత్తులడంచి బు ద్ధిపరమాత్మయందుజేర్చి నవవిధ శుశ్రూషలు చేయుచుండెడి ముముక్షువులు కృతకృత్యులగుదురు కైవల్యప్రాప్తికి నదుపా యమైన యోగసాధనమిదియే సూర్యుడుదయమై చీకటివణగిం

కొందుచుండుటయే జీవన్ముక్తికి సాధనమని గ్రహించవలెను॥

క॥ గురుశిష్య భావకల్పక। గురుశిష్యాచారధర్మగుణపరిపాలా।
గురుశిష్యరూపధారీ। గురుశిష్యకావబోధగుణగురుమూర్తీ॥

పంచమలముల వివరము.

నమోహరాయ దేవాయ మహామాయా త్రిశూలినే। తాపశా
య మహేశాయ తత్త్వజ్ఞానప్రదాయినే॥

నమః పరాయరుద్రాయ మహానాయనమోనమః। విశ్వమూ
ర్తిమహేశాయ విశ్వాధారాయతేనమః॥

నమోభక్తభవచ్ఛేద కారణాయామలాత్మనే। కాలకాలాయ
కాలాయ కాలాతీతాయతేనమః॥

పంచమలములనగా ఆణవము ౧ కార్మికము ౩ మాయికము ౪ మాయే ౫ తిరోధానములని తెలియుంగనగు॥

౧ ఆణవమలమనగా.— పరబ్రహ్మవిషయిక జ్ఞానము కలుగుచున్నప్పుడు దానిమరుగు చేయుచుండుబుద్ధి.

౨ కార్మికమలమనగా.— గురుసన్నిధులు వేదాంగ శాస్త్రవిషయిక జ్ఞానమునుబోధించునప్పుడుగాని వినికడయందుగాని యితరవృత్తులు గల్పించుచుండు బుద్ధి.

౩ మాయికమలమనగా.— పరబ్రహ్మవిషయిక జ్ఞానమును మదివంటనివ్వక చేయుచుండు మూఢబుద్ధి.

౪ మాయేమలమనగా.— పాపకార్యములయందు మనస్సును హొరకొట్టి అందేసంతోషింప చేయుచుండుబుద్ధి.

౫. తిరోధానమలమనగా — నిత్యానిత్య పరిపూర్ణపర బ్రహ్మమందు అనిత్యబుద్ధిని గల్పించి యాపరబ్రహ్మముకంటె వేరుదేవతలు మంత్రతంత్రములు క్రియలు మతములున్నట్టు సాధనములున్నట్టుగల్పించి జననమరణ ప్రవాహములలోఁ బొని పి యనుభవింపఁజేయుచుండుబుద్ధి.

శ్లో॥ దేవస్యాపిప్రపంచత్వా ప్రాగ్ధావస్థితిఃకుతః । అజ్ఞాన జనబోధాయ ప్రారబ్ధం వ్యక్తివై శ్రుతిః॥

వ. అనఁగా శరీరము పృథ్వ్యాది భూతసంయోగ వికార మునకు ప్రారబ్ధము గలుగంజాలదు ప్రారబ్ధము జ్ఞానహీనులకొరకు చెప్పఁబడి యున్నది సుజ్ఞానతత్త్వపూర్ణోదయము కలుగుచుండగా నీదేహాది ప్రపంచమునకు ప్రారబ్ధకర్మలు లేవని వేదము లుచ్చరించుచున్నవి (ప్రారబ్ధము లేనేలేదని) యజ్ఞానులకుపదేశించినచో నాయజ్ఞానులు పాటువడరని ప్రారబ్ధమున్నట్లు చెప్పఁబడియున్నది ఏమనుజుఁడు బ్రహ్మసుజ్ఞానతత్త్వ పూర్ణోదయమంది వృద్ధిబొందుచున్నాఁడో యామనుజుఁడు ముల్లోకములలోఁ పూజ్యుండై ప్రకాశించును.

## —[*] తాపత్రయ వివరము. [*]—

శ్లో॥ రక్షరక్షమహాదేవ రక్షమస్వాకరుణాలయః । భక్తచిత్త సమాసీన బ్రహ్మవిష్ణు శివాత్మక॥

శ్లో॥ జితేంద్రియాయ నిత్యాయ జితక్రోధాయతేనమః । నమః పాపాంతభంగాయ నమఃపాప హరాయతే॥

తుంపైయుండుట) నిట్టిచతుర్విధ శుశ్రూషలు చేయుచు గురుని పూజించుచుండు వారలే ప్రియసిష్యులగుచుందురు.

—[*] కందార్థములు. [*]—

పరిపూర్ణమైననిర్గుణ। పరవస్తువుగానరాదు బడసెదరె టులన్ । గురిగుర్తులేనివారికి। నిరతంబగుబట్టబయలు। నిజము గాదన్నా ♦ సద్గురుభక్తి♦ భజియింపకన్న♦ అజపమందినతత్త్వ మాన్యాంతసూన్యము । సుజనాసక్తవ్యక్త సూక్ష్మముమదిలోన। నిజపమాదిని ధర్శనంబున। నిర్వికార నిరంజనంబగు। విజితమూ పన భావమందక। విహరణం బొనరించువారికి ♦ నిజముగాద న్నా ♦ సద్గురుభక్తి ♦ భజియింపకన్న॥

—[*] సాధనచతుష్టయ సంపత్తివివరము. [*]—

శ్లో॥ అజ్ఞానకలుషంజీవం జ్ఞానాభ్యాసాద్వి నిర్మలమ్। కృత్వా జ్ఞానం స్వయంనశ్యే జ్జలంకతక రేణువత్ ॥

వ. అనగా చిరకాలము జ్ఞానాభ్యాసమువల్ల యజ్ఞానము నశించి పరిశుద్ధునిగా జేయును ఇందువకి:ఐ నరుగదీసిన గంధ మును జలమున చేర్చినతోడనే జలమునందలి బురద వేరగువట్లు జ్ఞానముచే నజ్ఞానమడంగి జీవన్ముక్తి ఘటించుచుండును.

శ్లో॥ బోధోన్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైక సాధనమ్ ॥ పాకస్యవహ్నివత్ జ్ఞానం । వినామోక్షోనసిద్ధ్యతి॥

వ. తపో మంత్రయోగాదులు జ్ఞానమునుపుట్టించి తద్వా రా మోక్షము సాధించగలవుగాని జ్ఞానసమాన సాధనకాదు పు ట్టినప్పటినుంచి యుందు నజ్ఞానము నాశమైనతోడనే పుట్టెడుజా

నముచే స్వారాజ్యాభిషేకమునుపొంది మోక్షమంద వచ్చును అన్నివస్తువులు పాకముచేయుటకు గలిగియున్నను నిప్పులేకపా కముగాదుగనుక జ్ఞానములేక మోక్షముబ్బదు.

శ్లో॥ అవిరోధిత యాకర్మ నావిద్యాం వినివర్తయేత్ ।
విద్యావిద్యాంనిహంతేవ తేజస్తిమిరసంఘవత్॥

వ. అనగా అజ్ఞానము ప్రపంచమునకు మూలప్రకృతి ప్రపంచాంతర్భూతము లైన కర్మలు జన్యజనకములు గనుక కర్మలుచే నజ్ఞానముపడచి సుజ్ఞాన స్వయంప్రకాశమును సం గ్రహించుటయే మోక్షమార్గము.

క॥ జీవిపోకముందే జీవవస్తువులిచ్చి। జీవినిలుపవలయు జీవన
ముగ। జీవితొలగువెనక జీవవస్తువులేల। విశ్వదాభిరామ
వినరవేమ॥

గీ॥ తాముగన్నవారు తముగన్నవారును। చచ్చువెల్లతమకు సా
క్షిగాదె। బ్రతుకువెల్లతమకు బ్రహ్మకల్పంబులా। విశ్వదా
భిరామ వినరవేమ॥

శ్లో॥ చక్తిసాధనయుక్తేన విచారః పురుషేనహి । కర్తవ్యో
జ్ఞానసిధ్యర్థ మాత్మవశ్శుభమిచ్ఛతా॥

వ. అనగా లోకమున పరసుఖమును గోరుపురుషుండు సాధనచతుష్టయ సంపత్సిద్ధిచే సంపాదించవలయును.

శ్లో॥ నోత్పద్యతే వినాజ్ఞానం విచారేణాన్యసాధనైః। యథా
పదార్థభానంహి ప్రకాశేన వినాక్వచిత్॥

వ. అనగాలోకమున సూర్యప్రకాశములేక పోయిన

నేదియుగానుపడదు అట్లే సాధనచతుష్టయము లేనప్పుడు తత్త్వ జ్ఞానము పుట్టనేరదు సుజ్ఞానతత్త్వ పూర్ణోదయ భావముచే విజ్ఞానమోక్షము సిద్ధించును.

తే॥ వర్ణములు పెక్కులై యున్న వానియందు। గలిగియున్నట్టి జీవు డొక్కండుసువ్వె । బహువిధచ్ఛాయలై యున్న పశు లయందు । పాలుదానొక్కటైయున్న భంగివోలె॥

తే॥ కర్మములు జేసిపెక్కులై కానబడియు । గర్మములుచెడ నొక్కటై గానవచ్చు । గానగర్మంబులనువవి గ్రాగుట యును । నేకరూపంబుజీవాత్మ యెల్లప్రొద్దు॥

క॥ తనలోపర్వంబుండగ। తవలోపల వెదక లేకధరలో వెదకే । తనువుల మోసెను యెద్దుల । మనమున దెలుపంగ వశమె మహిలో వేమా॥

వ. జీవులకు నావరణము లేదుగలవందు—౧ దుఃఖము ౨ శరీరపరిగ్రహము ౩ కర్మ ౪ రాగద్వేషములు ౫ అభిమానము ౬ అవివేకము ౭ అజ్ఞానము=దుఃఖము, శరీరపరిగ్రహము వల్ల గలుగుచుండును శరీర పరిగ్రహము కర్మవల్ల లభించును కర్మ రాగద్వేషములవల్ల లభించుచుండును రాగద్వేషాదులు అభిమానమువల్ల వచ్చుచుండును అభిమాన మవివేకమువల్లప్రాప్తమగును అవివేకమజ్ఞానమువల్లవచ్చును అజ్ఞానమనాదియైనది శ్రీగురుస్వాముల కరుణచే సుజ్ఞానతత్త్వపూర్ణోదయమందిన యజ్ఞానముహరించును నాయజ్ఞాన మడంగినతోడనే యవివేకమును యవివేక మడంగినతోడనే యభిమానమును యభిమాన

మడంగినతోడనే రాగద్వేషములును రాగద్వేషము లడంగిన తోడనే కర్మయును కర్మతోడ శరీరపరిగ్రహము శరీరపరిగ్రహముతోడనే దుఃఖము వటాపంచలై కృశించుచుండును ఇట్టి మర్మమును గురూపదేశసాధనవల్ల సప్తావరణములు దాటినట్టి వారు సీటియందలి నివాసంబైయుండు నక్రంబునేనుగుఁ బట్టి పీనుంగుజేయుచుండు నట్టినక్రంబు బైటికివచ్చిన భషకంబుచే భంగపడు రీతిని గురునివల్ల సప్తావరణములు నశించినచో ముక్తిమార్గ మరిచేతిదైయ్యుండునని గ్రహించందగు నట్లనిన సప్తావరణములుదాటి సాధనచతుష్టయసంపత్తిగలిగి యున్న వారలకు నిత్యానిత్య వివేకము ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము శమాధి షట్కసంపత్తియు ముముక్షుత్వములను నాల్గు విధములలో మొదటిదైన నిత్యానిత్య వివేకమనగా దృశ్యప్రపంచమంతా మిథ్యగానెంచి బ్రహ్మసత్యమని మదినెఱుంగుట రెండవదైన నిహాముత్రార్థ ఫలభోగ విరాగమనగా నీయిహ లోక సంపత్ప్రదవులవల్ల వమనాన్నమును మలమును మూత్రమును ఆశించకరోయునట్లు లోకవాసనలయందు నిరాశగలిగి యుండుట శమాది షట్కసంపత్తియనగా శమము దమము ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానములను సుగుణములారును గలిగియుండుట అందుశమమనగా నంతరింద్రియ నిగ్రహము దమమనగా బాహ్యేంద్రియ నిగ్రహము ఉపరతియనగా సర్వకర్మలుచేయుచు క్రమప్రకారము సన్యశించియుండుట తితీక్షయనగా సుఖదుఃఖ ములయందు సహించి నొక్కటిరుగానుండుట

శ్రద్ధయనగా గురువుయందు వేదాంతమందు ఈశ్వరుని యందు విశ్వాసము విడువక యుండుట సమాధియనగా మహావాక్యములను మనస్సునన్పృథ వరచుకొనుచు పరమాత్మయందు బుద్ధి నొక్క తద్వైకనిష్ఠతో నైక్యమందు చుండుట ఇట్టి సాధనచతుష్టయ సంపత్సిద్ధి గలిగినవారలే మోక్షాధికారులుగా నెఱుంగనగు చిదాభాసుండైన జీవుని చిత్తచైతన్యమును కూటస్థుడైన పరమాత్మయందు చేర్చి మనోరాజ్యమును కోరి పరమకుండలియగు బ్రహ్మను సహస్రారదళ పద్మకర్ణిక కుహరాంతరమందు కుండలిచేర సాధించుటయే సాధనము॥

—[*] రాగద్వేషాదుల వివరము. [*]—

శ్లో॥ రజ్జుసర్పవదాత్మానం జీవంజ్ఞాత్వాం భయంవహేత్ ।
నాహంజీవః పరాత్మేతి జ్ఞాతశ్చేన్నిర్భయో భవేత్॥

వ. అనగా జీవుడు రాగాదులలో చేరి అహంకారముచే సుఖదుఃఖముల ననుభవించు సద్గురుజ్ఞానముచే నాత్మజ్ఞానోదయమైన నిర్భయుండగు॥

శ్లో॥ అమనస్త్వాన్న మేదుఃఖ రాగద్వేషభయాదయః । అప్రాణోహ్యమనాశ్శుభ్రి ఇత్యాది శ్రుతిశాసనాత్॥

వ. అనగా ఆత్మప్రాణము మనస్సులేని పరిశుద్ధుడని శ్రుతులప్రమాణము గనుక తనకు మనోధర్మ సుఖదుఃఖములు లేవని చింతించుచుండాదగు॥

శ్లో॥ తత్త్వా మోహార్ణవంహత్వా రాగద్వేషాధి రాక్షసాః।
యోగీశాంతి సమాయుక్తః ఆత్మారామో విరాజతే॥

వ. అనగా నిశ్శేషముగా కామక్రోధాది రాక్షసుల జయించి నిశ్చలచిత్తుడై తనంతటతానే సుజ్ఞానతత్త్వ పూర్ణోదయానందమును పొందందగు॥

క॥ జ్ఞానముసద్గతిజూపును। బోనడచు సమస్తదుఃఖ మోహామతం
బుల్ । మానవులకు మోక్షప్రదమై। నాశనరహిత పదము
నందగ జేయు౯॥

రాగద్వేషాదులు ౧౩ విధములైయున్నవి జీవులునీపదమూడును జయించవలెను ౧ రాగము ౨ ద్వేషము ౩ కామము ౪ క్రోధము౫లోభము ౬ మోహము ౭ మదము ౮ మాత్సర్యము ౯ ఈర్ష్య ౧౦అసూయ ౧౧డంభము ౧౨దర్పము ౧౩అహంకారము నీపదమూడు విధములలో మొదటి రాగమనగా పరస్త్రీలయందలి గమనము ద్వేషమనగా అపకారముచేయవలెననుచిత్తవృత్తి కామమనగా ఐక్కిలిసంపాదనయందు కోర్కెయుండడము క్రోధమనగా తనకార్య విఘ్నముచేసినవారినిశిక్షించుటకై గలిగెడు చిత్తక్షోభము లోభమనగా తనసొత్తును యితరులకు యివ్వకూడదనే చిత్తవృత్తి మదమనగా తానుయేమిచేసినను చెల్లుచున్నదను గర్వవృత్తి మాత్సర్యమనగా నితరులు హెచ్చుగానుండుటకు సహించని చిత్తవృత్తి ఈర్ష్యయనగాతనతోపాటి యితరులు కష్టపడవలెననెడు చిత్తవృత్తి డంభమనగా తానుచేయుకార్యము యితరులు మెచ్చుచుందురనే కోర్కెగలచిత్తవృత్తి దర్పమనగా నేనేసమర్థుడను నాకుసాటిలేదను

చిత్తవృత్తి అహంకారమనగా పట్టినపట్టు విడువక అదలించు చిత్తవృత్తి॥

క॥ మేలును కీడును రెండును। వాలాయము నొక్కరీతి వైరాగ్యముతో। జాలింబడకను డొందము। నేలెడువాడిక జనించ నేరదుజీవా॥

క॥ కామము క్రోధము లోభము। బాములకిరవైనవైరి వర్గములర యర్గా। ధీమంతులు బరిమార్తురు కామాదుల చూరగొనుము ఘట్టిగ జీవా॥

—[*] మానసపూజా సంగ్రహము. [*]—

శ్లో॥ పాహిపాహి పరబ్రహ్మ పాహిపాహి స్వయంప్రభుః।
మమయున్నా రనం దేవా బృహిమే లోకనాయకః॥

పంచచామరం.— మనంబెస్థూల మాత్మముల్ప్రమాత్రుమాన మేయముల్। మనంబెకామ రాగరోష మత్సరాది వృత్తులు। స్మనంబెసర్వ సర్మముల్మనంబె బంధమోహముల్। మనంబె దృశ్యరుంలెయుర్గా। గ్రమంబుచే నెఱింగినర్గా॥

తే॥ సర్వసంసార మనుమాన సముననొదవు। సర్వసంసారమును మాన సమునయుండు। సర్వసంసారమును మాన సమునసడంగు। సర్వసంసార మనుమాన సంబెయగును॥

క॥ తనుదాగావని మనుజుని। మనముని రోధింపబడక మసలుచు దిరుగుర్గా। దనుదాగను సత్పురుషుని। మనమానందాబ్ధి యందు మగ్నతనొందుర్గా॥

క॥ ఈమంత్ర మతవమున నే। భామామణియెవ్వరైన బ్రాహ్మ
ణుడుబో। యీమంత్రి మెఱుఁగకుండిన। భూమీసురు డట్టుల
గును బుద్ధిదలంపఁ॥

క॥ జ్ఞానోదయమగలిగిన। మానవులకు పాపవిధులు మారణ
మానుం। అనినకటకవ్రుబీజము। తోనిర్మలనీరు చేరితోఁ గును
మలినం॥

మ॥ నిరతంబుఁ భజియించు సజ్జనమనో నేత్రాభిరామమ్మైకను
స్థిరదివ్యప్రభగల్గు కౌస్తుభమ చిశ్లిష్టంబు నై యొప్పినా। వర
యోగీశ్వర వంద్యమానుడగు సర్వస్వామి లక్ష్మీసుకం। ధర
మాత్మన్ గదియించి తద్గుణగణ ధ్యానంబు సేయఁదగున్॥

క॥ హరిసేవ న్నాప్రియవ్రతు। డగయఁగ కైవల్యపదవి నందుట
యరు దే। ధరజండాలుండైనను। హరినామ స్మరణ జెందు న
వ్యయపదమున్॥

ఉ॥ మానసపూజయొందునమహా నుయతాద్భుతమేమి చెప్పఁగన్।
ధ్యానము లేదు వ్యాసకళ తత్త్రము లేమియు నుండఁబోవుచు।
స్నానము నొల్లవాసనము చక్కని తావులు కోరదెన్నఁగన్।
పానము భోజనంబులను పాకము లెంచదు బ్రహ్మమేసుమా॥

క॥ నీనేత్రంబులతోఁ గని। మానక పూజింపు వెలిని మంత్రంబే
లా। తానే వెలుఁగై యుండగ। మానకుమా బ్రహ్మపదము
మాయలు లేవే॥

క॥ ఈపూజ గలుగుజ్ఞానులు। యేపూజలు కాయభోగ యేక

ము వెలుగే। ప్రావున విశ్వబ్రహ్మము। లోపలబైలందునిం
దు లోలోకములగ॥

గీ॥ విశ్వమందునాత్మ వెలయుటనెఱుగక । వేరెయుండుననుచు
వెదుకనేల। తనదులోనయాత్మ యొనరియుంటనిజమ్ము॥ వి॥

క॥ ఈపూజచేయువారికి। నేపూటను మ్రొక్కుచుండు నిజము
గనేనే। యాపుణ్యాత్ములరూపము। కాపాడుదు సర్వలోక
కాపైనేనే॥

జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియములు పూజా
పాత్రములుగాను గంగాయమున సరస్వతులను పేరంబరిగెడు
యిడపింగళ సుషుమ్నలు అభిషేకజలంబులుగాను షట్కమల
ములు పుష్పములుగాను జఠరాగ్ని రూపముగాను చిత్కళలు
దీపముగాను బ్రహ్మానందము నైవేద్యముగాను సూర్యచంద్ర
మండలముల జ్యోతులారతులుగాను శరీరగుణేదు దేవాలయ
మందు సహస్రారసింహాసనముపైన పరమాత్మస్వరూప చిద్బ్రిం
హ్మంబును భావించి పూజించియానంద మొందుచుంట ఈశ్వర
ప్రణిదాన భావనాయంత్ర మనిపేరుచే పెద్దలు వక్కాణించుదు
రట్టి మానసధ్యానము నేకాగ్ర చిత్తంబుతోడ స్మరింపు చుండిన
మోక్షమరచేతిదై ఘటిల్లుచుండు॥

క। మానస కమలమునందున। శ్రీనారాయణమూర్తి జింతించు
చులో। ధ్యానముసేయుటసగుణ। భావంబనియండ్రు సుజ
నులమలవివేకా॥

